# అథ ఏకవింశో%ధ్యాయః

# గణాధ్యక్షుల యుద్ధము

సనత్కుమార ఉవాచ |

తే గణాధిపతీన్ దృష్ట్వా నందీభముఖ షణ్ముఖాన్ |
అమర్షాదభ్యధావంత ద్వంద్వయుద్ధాయ దానవాః || 1

నందినం కాలనేమిశ్చ శుంభో లంబోదరం తథా | నిశుంభష్షణ్ముఖం దేవమభ్యధావత శంకితః || 2

నిశుంభః కార్తికేయస్య మయూరం పంచభిశ్శరైః | హృది వివ్యాధ వేగేన మూర్ఛితస్స పపాత హ || 3

తతశ్శక్తిధరః క్రుద్ధో బాణైః పంచభిరేవ చ | వివ్యాధ స్యందనే తస్య హయాన్ యంతారమేవ చ || 4

శ##రేణాన్యేన తీక్ష్ణేన నిశుంభం దేవవైరిణమ్ | జగాన తరసా వీరో జగర్జ రణదుర్మదః || 5

అసురో%పి నిశుంభాఖ్యో మహావీరో%తివీర్యవాన్ | జఘాన కార్తికేయం తం గర్జంతం స్వేషుణా రణ ||

తతశ్శక్తిం కార్తికేయో యావజ్జగ్రాహ రోషతః | తావన్నిశుంభో వేగేన స్వశక్త్యా తమపాతయత్ || 7

సనత్కుమారుడిట్లు పలికెను-

నంది, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి అను గణాధ్యక్షులను గాంచి ఆ రాక్షసులు కోపముతో ద్వంద్వయుద్ధము కొరకై వారిపైకి ఉరికిరి (1). కాలనేమి నందితో మరియు శుంభుడు విఘ్నేశ్వరునితో తలపడిరి. నిశుంభుడు సందేహిస్తూనే షణ్ముఖదేవునిపైకి ఉరికెను (2). నిశుంభుడు అయిదు బాణములతో కుమారస్వామి యొక్క నెమలిని బలముగా హృతయమునందు కొట్టగా, అది మూర్ఛిల్లి నేలగూలెను (3). అపుడు శక్తి ధరుడగు కుమారస్వామి కోపించి

అయిదు బాణములతో వాని గుఱ్ఱములను, మరియు సారథిని కూడ కొట్టెను (4). యుద్ధములో అజేయుడగు ఆ వీరుడు మరి యొక వాడి బాణముతో నిశుంబాసురుని గట్టిగా కొట్టి గర్జించెను (5). మహావీరుడు గొప్ప పరాక్రమ శాలియగు నిశుంభాసురుడు కూడ యుద్ధములో సింహనాదము చేయుచున్న ఆ కుమారస్వామిని తన బాణముతో కొట్టెను (6). తరువాత కుమారస్వామి కోపముతో శక్తిని తీసుకోన బోవునంతలో నిశుంభుడు వేగముగా తన శక్తితో దానిని కూల్చి వేసెను (7).

ఏవం బభూవ తత్రైవ కార్తికేయ నశుంభయోః | ఆహావో హి మమాన్ వ్యాస వీరశబ్దం ప్రగర్జతోః || 8

తతో నందీశ్వరో బాణైః కాలనేమిమవిధ్యత | సప్తభిశ్చ హయాన్ కేతుం రథం సారతి మాచ్చినత్ || 9

కాలనేమిశ్చ సంక్రుద్ధో ధనుశ్చిచ్ఛేద నందినః | స్వశరాసన నిర్ముక్తైర్మహాతీక్ష్ణై శ్శిలీముఖైః || 10

అథ నందీశ్వరో వీరః కాల నేమిం మహాసురమ్ | తమపాస్య చ శూలే వక్షస్యభ్యహనద్ధృఢమ్ || 11

స శూలభిన్నహృదయో హతాశ్వో హతసారథిః | అద్రేశ్శిఖరముత్పాట్య నందినం సమతాడయత్ || 12

అథ శుంభో గణ శశ్చ రథమూషకవాహనౌ | యుధ్యమానౌ శరవ్రాతైః పరస్పరమవిధ్యతామ్ || 13

గణ శస్తు తదా శుంభం హృది వివ్యాధ పత్రిణా | సారథిం చ త్రిభిర్బాణైః పాతయామాస భూతలే || 14

ఈ విధముగా అచట వీరవబ్దములతో గర్జించుచున్న కార్తికేయనిశుంభులకు గొప్ప యుద్ధము జరిగెను. ఓవ్యాసా! (8) అపుడు నందీశ్వరుడు ఏడు బాణములతో కాలనేమిని కొట్టి గుఱ్ఱములను, జెండాను, రథమును సారథిని చీల్చి వేసెను (9). కాలినేమి కూడ కోపించి తన ధనస్సు నుండి విడిచి పెట్టబడిన

మిక్కిలి వాడియగు బాణములతో నందియొక్క ధనస్సును విరుగగొట్టెను (10). అపుడు వీరుడగు నందీశ్వరుడు మహారాక్షసుడగు ఆ కాలనేమిని ప్రక్కకు నెట్టి శూలముతో గట్టిగా వక్షస్థ్సలమునందు గొట్టెను (11). అతని వక్షస్థ్సలము ఆ శూలపు దెబ్బకు చీలియుండెను. అతని గుర్రములు మరియు సారథి మరణించిరి. అపుడు ఆతడు పర్వత శిఖరమును పెకలించి దానితో నందిని కొట్టెను (12). మరియు రథమును అధిష్ఠించియున్న శుంభుడు, మూషకవాహనుడగు గజాననుడు యుద్ధమును చేయుచూ, బాణపరంపరలతో ఒకరినొకరు కొట్టిరి (13). అపుడు గజాననుడు శంభుని బాణముతో హృదయమునందు కొట్టెను. మరియు మూడు బాణములతో సారథిని నేలగూల్చెను (14).

తతో%తిక్రుద్ధశ్శుంభో%పి బాణవృష్ట్యా గణాధిపమ్ | మూషకం చ త్రిభిర్విద్ధ్వా ననాద జలదస్వనః || 15

మూషకశ్శరభిన్నాంగశ్చచాల దృఢవేదనః | లంబోదరశ్చ పతితః పదాతిరభవత్స హి || 16

తతో లంబోదరశ్శుంభం హత్వా పరశునా హృది | అపాతయత్తదా భూమౌ మూషకం చారురోహ సః || 17

సమారాయోద్యతశ్చాభూత్పునర్గదజముఖో విభుః | ప్రహస్య జఘ్నతుః క్రోదాత్తోత్రేణ  వ మహాద్విపమ్ || 18

కాలనేమిర్నిశుంభశ్చ హ్యుభౌ లంబోదరం శ##రైః | యుగపచ్ఛఖ్నతుః క్రోధాదాశీవిషసమైర్ద్రుతమ్ || 19

తం పీడ్యమానమాలోక్య వీరభద్రో మహాబలః | అభ్యధావత వేగేన కోటి భూతయుతస్తథా || 20

కూష్మాండా భైరవాశ్చాపి వేతాలా యోగినీగణాః | పిశాచా డాకినీ సంఘా గణాశ్చాపి సమం యయుః || 21

అపుడు శుంభుడు కూడ మిక్కిలి కోపించి గజాననుని బాణవర్షముతో ముంచెత్తి మూషకమును మూడు బాణములతో గొట్టి మేఘమువలె గర్జించెను (15). బాణములచే చీల్చబడిన అవయవములు గల మూషకము తీవ్రవేదనచే కంపించి పోయెను. నేలపైబడిన గజాననుడు పదాతి ఆయెను (16). అపుడు గజాననుడు శంభుని పరశువుతో హృదయమునందు కొట్టి నేలపై బడవేసి మూషకమునధిష్ఠించెను (17). మరల విఘ్నేశ్వరప్రభుడు యుద్ధమనకు సంసిద్ధుడాయెను. శుంభుడు నవ్వి పెద్ద ఏనుగును అంకుశముతో కొట్టిన విధంబున ఆయనను కోపముతో కొట్టెను (18). కాలనేమి మరియు నిశుంభుడు వీరిద్దరు కలిసి క్రోధమును ప్రదర్శిస్తూ ఏకకాలములో, సర్పముల వలె ప్రాణాంతకములగు బాణములతో గజాననుని ఒక్కుమ్మడిగా ముట్టడించిరి (19). ఇట్లు వ్యథను పొందియున్న గజాననుని గాంచి మహాబలుడగు వీర భద్రుడు కోటి భూతములతో గూడి వేగముగా ఆతని వైపునకు పరుగెత్తెను (20) ఆయనతో బాటు కూష్మాండులు, భైరవులు, వేతాలులు, యోగనీగణములు, పిశాచములు, డాకిన్యాది గణములు కూడ వచ్చినవి (21).

తతః కిలకిలాశ##బ్దైస్సింహనాదైస్సఘర్ఘరైః | వినాదితా డమరుకైః పృథివీ సమకంపత || 22

తతో భూతాః ప్రధావంతో భక్షయంతి స్మ దానవాన్ | ఉత్పత్య పాతయంతి స్మ ననృతుశ్చ రణాంగణ || 23

ఏతస్మిన్నంతరే వ్యాసాభూతాం నందీ గుహశ్చ తౌ | ఉత్థితావాప్త సంజ్ఞౌ హి జగర్జతురలం రణ || 24

స నందీ కార్తికేయశ్చ సమాయాతౌ త్వరాన్వితౌ | జఘ్నతుశ్చ రణ దైత్యా న్నిరంతర శరవ్రజైః || 25

ఛిన్నైర్భిన్నైర్ధ్వతైర్దైత్యైః పతితైర్భవక్షితైస్తథా | వ్యాకులా సాభవత్సేనా విషణ్ణవదనా తదా || 26

ఏవం నందీ కార్తికేయో వికటశ్చ ప్రతాపవాన్ | వీరభద్రో గణాశ్చన్యే జగర్జు స్సమరేఽధికమ్ || 27

నిశుంభశుంభౌ సేనాన్యౌ సింధుపుత్రస్య తౌ తథా | కాలనేమిర్మహాదైత్యోఽసురాశ్చాన్యే పరాజితాః || 28

అపుడు భూమి కిలకిలారావములతో, సింహనాదములతో, గర్జనలతో మరియు డమరుక ధ్వనులతో నిండి కంపించెను (22). అపుడు భూతములు యుద్ధ భూమిలో వేగముగా పరుగులెత్తుచూ రాక్షసులను తినుచుండెను; పైకి ఎత్తి క్రింద పారవేయుచుండెను? మరియు నాట్యమాడుచుండెను (23). ఓ వ్యాసా! ఇంతలో నంది మరియు గుహుడు సంజ్ఞను పొంది నిలబడిరి. వారు అపుడా యుద్ధరంగములో అనేక పర్యాయములు గర్జించిరి (24). అపుడు నంది, మరియు గుహుడు వేగముగా యుద్ధములోనికి ప్రవేవించి అవకాశము లేని విధముగా బాణపరంపరలతో రాక్షసులను ముంచెత్తి సంహరతించిరి (25). తెగ గొట్ట బడిన వారు, చితుక గొట్టబడినవారు, సంహరింపబడిన వారు, నేలగూలిన వారు మరియు భక్షింపబడినవారు అగు రాక్షసులతో ఆ సైన్యము అల్లకల్లోలమయ్యెను. సైన్యములో విషాదము అలుముకొనెను (26). ఈ తీరున భయంకరాకారుడు ప్రతాపవంతుడు అగు కుమారస్వామి, నంది, వీరభద్రుడు మరియు ఇతర గణములు ఆ యుద్ధములో అధికముగా గర్జించిరి (27). జలంధరుని సేనానాయకులగు నిశుంభ శుంభులు, మహాసురుడగు కాలనేమి మరియు ఇతర రాక్షసులు పరాజయమును పొందిరి (28).

ప్రవిధ్వస్తాం తతస్సేనాం దృష్ట్వా సాగరనందనః | రథేనాతి పతాకేన గణానభియ¸ౕ బలీ || 29

తతః పరాజితా దైత్యా అప్యభూవన్మహోత్సవాః | జగర్జురధికం వ్యాస సమరాయోద్యతాస్తదా || 30

సర్వే రుద్ర గణాశ్చాపి జగర్జుర్జయశాలినః | నంది కార్తికదంత్యాస్య వీరభద్రాదికా మునే || 31

హస్త్యశ్వరథ సంప్రహ్లాదశ్శంఖభేరీరవస్తథా | అభవత్సింహ నాదశ్చ సేనయోరుభయోస్తథా || 32

జలంధరశరవ్రాతైర్నీ హారపటలైరివ | ద్యావాపృథివ్యో రాచ్ఛన్నమంతరం సమపద్యత || 33

శైలాదిం పంచభిర్విద్ధ్వా గణ   శం పంచభిశ్శరైః | వీరభద్రం చ వింశత్యా ననాద జలదస్వనః || 34

కార్తికేయస్తతో దైత్యం శక్త్యా వివ్యాధ సత్వరమ్ | జలంధరం మహావీరో రుద్రపుత్రో ననాద చ || 35

అపుడు సముద్రపుత్రుడు, బలశాలి యగు జలంధరుడు తన సేన చెల్లాచెదరగుటను గాంచి, రెపరెపలాడు తున్న జెండా గల రథముపై నెక్కి గణముల వైపునకు వేగముగా వెళ్లెను (29). ఓ వ్యాసా! అపుడు పరాజితులై యున్న రాక్షసులు కూడా గొప్ప ఉత్సాహమును పొంది యుద్ధమునకు సన్నద్ధులై అధికముగా గర్జించిరి (30). నంది, కుమారస్వామి, గజాననుడు, వీరభద్రుడు మొదలుగా గల రుద్రగణములందరు కూడా జయోత్సాహము గలవారై, గర్జించిరి. ఓ మునీ! (31) రెండు సేనలలో గుర్రముల సకిలింపులు, ఏనుగుల ఘీంకారములు, రథముల ధ్వని, శంఖముల ధ్వని, భేరీల ధ్వని, మరియు సింహనాదములు మిన్ను ముట్టెను (32). భూమికి, స్వర్గమునకు మధ్యలోగల ఆకాశము జలంధరుని బాణములచే పొగమంచు తునకలతో వలె కప్పివేయబడెను (33). ఆతడు నందిని అయిదు, గణ   శుని అయిదు, మరియు వీరభద్రుని ఇరవై బాణములతో కొట్టి మేఘధ్వనితో సింహనాదమును చేసెను (34). అపుడు వెంటనే మహావీరుడు, రుద్రపుత్రుడు అగు కుమారస్వామి జలంధరాసురుని శక్తితో కొట్టి సింహనాదమును చేసెను (35).

స ఘూర్ణనయనో దైత్యశ్శక్తి నర్భిన్నదేహకః | పపాత భూమౌ త్వరితముదతిష్ఠ న్మహాబలః || 36

తతః క్రోధపరీతాత్మా కార్తికేయం జలంధరః | గదయా తాడయామాస హృతయే దైత్యపుంగవః || 37

గదా ప్రభావం సఫలం దర్శయన్ శంకరాత్మజః | విధిదత్త వరాద్వ్యాస స తూర్ణం భూతలేఽపతత్ || 38

తథైవ నందీ హ్యపతద్భూతలే గదయా హతః | మహావీరోఽపి రిపుహా కించిద్వ్యాకులమానసః || 39

తతో గణ   శ్వరః క్రుద్ధ స్మృత్వా శివపదాంబుజమ్ | సంప్రాప్యాతిబలో దైత్యగదాం పరశునాచ్ఛినత్ || 40

వీరభద్రస్త్రి భిర్బాణైర్హృతి వివ్యాధ దానవమ్ | సప్తభిశ్చ హయాన్ కేతుం ధనుశ్ఛత్రం చ చిచ్ఛిదే || 41

తతోఽతి క్రుద్ధో దైత్యేం ద్రశ్శక్తిముద్యమ్య దారుణామ్ | గణ   శం పాతయామాస రథమన్యం సమారుహత్ || 42

శక్తిచే చీల్చబడిన దేహము గల ఆ రాక్షసుడు కన్నులు తిరుగుటచే నేలపై బడెను. కాని మహాబలశాలి యగుటచే వెంటనే లేచి నిలబడెను (36). అపుడు రాక్షసశ్రేష్ఠుడగు జలంధరుడు క్రోధముతో నిండిన మనస్సు గలవాడై కుమారస్వామిని గదతో వక్షస్థ్సలముపై కొట్టెను (37). శంకరపుత్రుడగు ఆ కుమారస్వామి వరముగా నీయబడిన ఆ గద ప్రభావశాలి యనియు, వరరము పఫలమనియు నిరూపించుటకై వెంటనే నేలపై బడెను (38). అదే విధముగా మహావీరుడు, శత్రువులను సంహరించువాడు అయిననూ నంది కొంత కల్లోలమును పొందిన మనస్సు గలవాడై గదచే కొట్టబడి నేలపై బడెను (39). అపుడు విఘ్నేశ్వరుడు మిక్కిలి కోపించి శివుని పాదపద్మములను స్మరించి అచటకు వచ్చి మహాబలశాలియై పరశువుతో రాక్షసుని గదను విరుగగొట్టెను (40). వీరభద్రుడు ఆ రాక్షసుని వక్షస్థ్సలముపై మూడు బాణములతో కొట్టి ఏడు బాణములతో గుర్రములను సంహరించి జెండాను, ధనస్సును

మరియు గొడుగును ఛేదించెను (41). అపుడ ఆ రాక్షసరాజు మిక్కిలి కోపించి భయంకరమగు శక్తని పైకి ఎత్తి విఘ్నేశ్వరుని నేలపై బడవేసి తాను మరియొక రథము నధిష్ఠించెన (42).

అభ్యగాదథ వేగేన స దైత్యేంద్రో మహాబలః | విగణయ్య హృదా తం వై వీరభద్రం రుషాన్వితః ||43

వీరభద్రం జఘానాశు తీక్ష్ణేనాశీవిషేణ తమ్ | ననాద చ మహావీరో దైత్యరాజో జలంధరః || 44

వీదభద్రో%పి సంక్రుద్ధ స్సితదారేణ చేషుణా | చిచ్ఛేద తచ్ఛరం చైవ వివ్యాధ మహేషుణా || 45

తతస్తౌ సూర్యసంకాశౌ యుయుధాతే పరస్పరమ్ |
నానాశ##సై#్రస్తథాసై#్రవ్చ చిరం వీరవరోత్తమౌ || 46

వీరభద్రస్తతస్తస్య హయాన్ బాణైరపాతయత్ | ధనుశ్చిచ్ఛేద రథినః పతాకాం చాపి వేగతః || 47

అథో స దైత్యరాజో హి పుప్లువే పరిఘాయుదః | వీరభద్రోపకంఠం స ద్రుతమాప మహాబలః || 48

పరిఘేనాతి మహతా వీరభద్రం జఘాన హ | మహాబలో%బ్ధితనయో మూర్ధ్ని వీరో జగర్జ చ || 49

అపుడు మహాబలశాలియగు ఆ రాక్షసరాజు మనస్సులో ఆ వీరభద్రుని ఏమియూ లెక్కచేయక కోపముతో నిండినవాడై వేగముగా ఆతని పైకి దండెత్తెను (43). మహవీరుడు, రాక్షసరాజు అగు జలంధరుడు ఆ వీరభద్రుని ఒక వాడి బాణముతో వేగముగా కొట్టి సింహనాదమును చేసెను (44). వీరభద్రుడు కోపించి పదునైన బాణముతో ఆ బాణమును ఛేదించి ఒక గొప్ప బాణముతో ఆతనిని కొట్టెను (45). ఆ తరువాత మహావీరులలో అగ్రగణ్యులు, సూర్యునితో సమమగు తేజస్సు గలవారు అగు వారిద్దరు అనేక శస్త్రాస్త్రములతో చిరకాలము ద్వంద్వయుద్ధమును చేసిరి (46). అపుడు వీరభద్రుడు రథియగు ఆ జలంధరుని గుర్రములను

బాణములతో నేలగూల్చి, ధనస్సును ఛేదించి, వేగముగా జెండాను కూడా పడగొట్టెను (47). అపుడు మహాబలుడగు రాక్షసరాజు పరిఘను చేతబట్టి వేగముగా గెంతి వీరభద్రుని సమీపమునకు వచ్చెను. (48). మహాబలుడు, సముద్రపుత్రుడు, వీరుడు అగు ఆ జలంధరుడు మిక్కిలి పెద్ద పరిఘతో వీరభద్రుని శిరస్సుపై కొట్టి గర్జించెను (49).

పరిఘేనాతిమహతా భిన్నమూర్ధా గణాధిపః | వీరభద్రః పపాతోర్వ్యాం ముమోచ రిధిరం బహు || 50

పతితం వీరభద్రం తు దృష్ట్వా రుద్రగణా భయాత్ | అపాగచ్ఛన్ రణం హిత్వా క్రోశమానా మహేశ్వరమ్|| 51

అథ కోలాహలం శ్రుత్వా గణానాం చంద్రశేఖరః | నిజపార్శ్వస్థితాన్ వీరానపృచ్ఛద్గణసత్తమాన్ || 52

గణాధ్యక్షుడగు వీరభద్రుడు మిక్కిలి పెద్దదియగు పరిఘచే కొట్టబడి పగిలిన శిరస్సు గలవాడై నేలపై బడెను. ఆతని తలనుండి చాల రక్తము స్రవించెను(50). వీరభద్రుడు నేల గూలుటను గాంచి రుద్రగణములు భయముతో ఆక్రోశిస్తూ యుద్ధమును వీడి మహేశ్వరుని వద్దకు పరుగెత్తిరి (51). అపుడ చంద్రశేఖరుడు గణముల కోలాహలమును విని తన ప్రక్కన నిలబడియున్న వీరులగు గణనాయకులను ప్రశ్నించెను(52).

శంకర ఉవాచ |

కిమర్థం మద్గణానాం హి మహాకోలాహలో% భ##వేత్ | విచార్యతాం మహావీరాశ్శాంతిః కార్యా మయా ధ్రువమ్ || 53

యావత్స ఇతి దేవేశో గణాన్ పప్రచ్ఛ సాదరమ్ | తావద్గణవరాస్తే హి సమాయాతాః ప్రభుం ప్రతి || 54

తాన్ దృష్ట్వా వికలాన్ రుద్రః పప్రచ్ఛ కుశలం ప్రభుః | యథావత్తే గణా వృత్తం సమాచఖ్యుశ్చ విస్తరాత్ || 55

తచ్ఛ్రుత్వా భగవాన్ రుద్రో మహాలీలాకరః ప్రభుః | అభయం దత్త వాంస్తేభ్యో మహోత్సాహం ప్రవర్ధయన్ || 56

ఇతి శ్రీ శివమహాపురాణ  రుద్రసంహితాయాం యుద్ధఖండే విశేషయుద్ధ వర్ణనం నామ ఏక వింశతితమోధ్యాయః (21).

శంకరుడిట్లు పలికెను -

నా గణములలో పెద్ద కోలాహలము చెలరేగుచున్నది. కారణమేమి? మహావీరులారా! పరిశీలించుడు. నేను నిశ్చయముగా ఈ కోలాహలమును శాంతింప జేయవలెను (53). ఆ దేవదేవుడు ఈ తీరును సాదరముగా గణాధ్యక్షులను ప్రశ్నించునంతలో, ఆ గణములు ప్రభువు సమీపమునకు వచ్చిరి (54). దుఃఖితులై యున్న వారిని గాంచి రుద్రప్రభుడు'కుశలమేనా?' యని ప్రశ్నించెను. ఆ గణములు జరిగిన వృత్తాంతమును యథా తథముగా విస్తరముగా చెప్పిరి (55). గొప్ప లీలలను చేయు భగవాన్ రుద్రప్రభుడు ఆ వృత్తాంతమును విని వారికి అభయమునిచ్చి వారిలో గొప్ప ఉత్సాహము వర్ధిల్లు నట్లు చేసెను (56).

శ్రీ శివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో విశేషయుద్ధవర్ణమనే ఇరువది ఒకటవ అధ్యాయము ముగిసినది (21).